# ఊర్వశీ ప్రణయకలహం

(ఊహాచిత్రం)



రచన:
ప్రజాకవి
వంగపండు అప్పలస్వామి,
పార్వతీపురం.

పబ్లిషర్సు
శ్రామిక రైతాంగ జనవిజ్ఞానపీఠం
విశాఖపట్నం.

**URVASI PRANAYA KALAHAM**
(Poetry)

Written by Poet & Writer
**VANGAPANDU APPLASWAMY**
Paravathi Puram-532 502
Vizianagaram Dt.

ఊర్వశీ ప్రణయకలహం
(ఊహాచిత్రం)

ప్రథమ ముద్రణ 1991
ప్రతులసంఖ్య 2,000

రచయిత
ప్రజాకవి
వంగపండు అప్పలస్వామి
పార్వతీపురం-532 502. విజయనగరం జిల్లా.

పబ్లిషర్సు
శ్రామిక రైతాంగ జనవిజ్ఞాన పీఠం
విశాపట్నం, ఆంధ్రప్రదేశ్

ముద్రణ
కళాజ్యోతి ప్రాసెస్ ప్రైవేట్ లిమిటెడ్
ముషీరాబాద్, హైదరాబాద్-20.

మూల్యం: పదిరూపాయలు

ప్రతులకు చిరునామా
అన్నపూర్ణ పబ్లిషర్స్
H.No.8-117
మారుతి నిలయం-శారదానగర్,
పెందుర్తి - 531 173.
విశాఖపట్నం.

# కృతి సమర్పణ

బహుముఖ ప్రజ్ఞాధురీణ
కావ్య నాట్య గాన కళానిధి
కోకా రాఘవరావు గారికి

కో కా రాఘవ రావుకె
నా కావ్యము కావ్య నాట్య గాన కళానిధి
ఆ కారము చిరు నగవుల
శ్రీకారము విజయ పథము విజ్ఞులు మెచ్చన్

రచయిత - ప్రజాకవి
వంగపండు అప్పలస్వామి
పార్వతీపురం,
విజయనగరం జిల్లా.

# ఆ ముఖమ్

''కావ్య నాట్య గాన కళానిధి''
బహుముఖ ప్రజ్ఞాధురీణ
కోకా రాఘవరావు.

ఊర్వశి పేరు వినగానే మనసు ఊహాలోకాల్లో తేలిపోయింది. ఊహావిహారంలో ఊర్వశి అందచందాలు నాట్య భంగిమలూ మబ్బులలో నాట్య వేదిక పూలశయ్య ఇంకా ఏవేవో మెదడులో మెదలాయి.

శ్రీ వంగపండు అప్పలస్వామి గారికి నాకు పరిచయం పాతిక సంవత్సరాలకుపైగా వృద్ధి చెంది స్నేహంగా పరిణమించింది. ఎప్పుడు హైదరాబాదు వచ్చినా వారు చేస్తున్న సాహితీ కృషి నాకు అందిస్తూ వుంటారు. ఈనాడు ఉదయమే మాష్టారు నా కుటీరానికి విచ్చేసి ఈ గ్రంథం నా చేతిలో వుంచారు. ''ఊర్వశి ప్రణయ కలహం'' అని చూడగానే నాకు ఏ సంఘటన ఈ గ్రంథంలో చోటు చేసుకుని వుంటుంది అని పురాణేతిహాసాల వైపు మనసు పరుగిడింది. వెంటనే తరువాతి వివరణ ''ఊహాచిత్రం'' అని కనబడింది. ఊహలో ఊర్వశి మెదిలింది.

అనేక ఉత్తమ గ్రంథాల రచయిత భావుకుడు, స్నేహశీలి, విజాయితీని విలిచే ధైర్యవంతుడు అన్నింటినీ ఆప్యాయతలను అందించే ఆప్తుడు శ్రీ వంగపండు మాష్టారు నాకు పరిచయం సాధారణ బడిపంతులుగా వటుడింతై, ఇంతింతై అన్నట్లు, ఉద్యోగా రీత్యా కాలేజి ప్రిన్సిపాలు స్థాయికి ఎదిగారు. ఈ 25 సంవత్సరాలలో అంతే కాదు అనేక కావ్యాలను రచించి - సాహితీ రంగంలో స్థిరమైన ఎత్తు పీట వేసుకుని కూచున్నారు. వీరి రచనలలో, ప్రస్తుత సమాజంలో వాస్తవము కళ్లకు కట్టినట్లు ఒక్కొక్కచోట కుండ బద్దలు కొట్టినట్లూ కనబడతాయి.

నా చేతిలో పుస్తకాన్ని పుటలు తెరిచి, ఒక్కొక్క పద్యం చదువుతూ షుమారు ఇరవై ఐదు నిమిషాలు ఐ వుంటుంది. మౌనంగా మరో లోకంలోకి ప్రయాణంచేసి, ఊర్వశి ఇప్పుడు మన మధ్యలో వచ్చి ఏం చేసిందో తెలుసుకుని - మానవజాతి ఆడదాన్ని ఆటవస్తువుగా పరిగణించడం పరిపాటిగా వున్న ఈ రోజుల్లో - అదికాదు ''స్త్రీ ఒక పవిత్ర మూర్తిగా'' భావించి ఆరాధించడం నేర్చుకోవాలి అని పాఠం చెప్పారు మాష్టారు. అంతసేపు నా ఎదురుగా శ్రీ వంగపండు వారున్నారని గమనించక పోవడం నా అంతట నేను గ్రంథపఠనం చేసుకుని పోవడం గ్రహించుకుని వారితో అన్నాను. ''క్షమించాలి'' అని వెంటనే వారన్నారుమీరు ఆ పదం ఉపయోగించ వద్దు. నా గ్రంథం మిమ్మల్ని ఇంతగా ఆకట్టు కొన్నందుకు నేను ఎంతో ఆనందం అనుభవించాను ఇంతసేపు! లేకపోతే మీరు ప్రతిక్షణాన్ని పరమ పవిత్రం గా ప్రయోజనకరంగా

వినియోగం చేయగల మీరు ఈ గ్రంధాన్ని ఆ మూలాగ్రంగా చదివారు అన్న విషయమొక్కటే చాలు, అంతేకాదు నా ఉద్దేశ్యం ''మీకు ఈ గ్రంధాన్ని అంకితం ఇవ్వాలి'' అన్న భావం నాలో మరీ ధృడమైంది ఈనాడు'' అని అన్నారు.

ఈ కావ్యం అతి విలువైన భావాలను అందమైన పొందిక గల పదాలలో పొదగడమే గాక కావ్య ప్రయోజనంమేరకు సమాజ వికాసానికి తోడ్పడే సంగీత, సాహిత్య, నృత్య కళల ప్రాశస్త్యమునుకూడ ఎత్తి చూపడం జరిగింది.

''నాద బ్రహ్మను సేవించి నర్తనమున
నాట్య విన్యాస శృతి లయల్ తాండవించ
సరస సంగీత సాహితి ఝరులు కురియ
పలువురిని ఓల లాడించు ప్రజ్ఞ మాది''

ఈ విధంగా నడిచిన ఆ పద్యాలు పదిపైగా ఉన్నాయి. అంతకన్న ముఖ్యమైనది.

''ఇంతి మానసోల్లాస స్రవంతిగాని
బాహ్య క్రీడకు వీలిచ్చు బంతిగాదు
వనితర సమయ మధుర రూపమ్మె గాని
ఇమ్మహిని తుచ్ఛ సుఖమిచ్చు బొమ్మ కాదు''

అన్న ఈ పద్యంలో ఆదర్శ భావాన్ని సమాజానికి అర్ధం పట్టి చూపించినదీ గావ్యం.

ఇన్ని విధాల అందమైన ఆదర్శమైన ఈ కావ్యాన్ని నాకు అంకితమివ్వాలనే భావం శ్రీ వంగపండు అప్పలస్వామి గారికి కలుగడం వారి విశాల హృదయానికి తార్కాణం. ఇదివరలో భగవద్గీత కావ్యాన్నీ, చాణక్య చంద్రగుప్త చరిత్రాత్మక నాటకాన్ని పాంచజన్య మనే గేయ కవితనూ వరుసగా నాకు అంకితం చేసిన మాష్టారు ఈ కావ్యాన్ని కూడా నాకే అంకిత మివ్వాలను కోవడం నాకు ఆశ్చర్యాన్ని గల్గించింది. మణులుగాని మాన్యాలుగాని వారు నానుండి ఎన్నడూ ఆశించలేదు. స్వప్రయోజనం స్వార్ధం కరుడు గట్టిన సమాజంలోని ఏ ప్రయోజనాన్ని ఆశించక ఆప్యాయతలకే విలువనిచ్చిన కవి హృదయానికి నా జోహార్లు.

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

— కోకా రాఘవరావు
హైద్రాబాద్, ఆం.ప్ర.

# తొలిపలుకు

"ఊర్వశి ప్రణయ కలహం" కావ్యంలో ఊర్వశి తెలియజెప్పిన సత్యాలు - జ్ఞాన దీపికలు. ఊర్వశి మూర్తిమత్వాన్ని ఔదార్యంతో దర్శించి అతి రామణీయకంగా దర్శింపజేసిన శ్రీ వంగపండు అప్పలస్వామి గారు రసజ్ఞుల హృదయాలను రంజింపజేసారు. అనేక పద్యగద్య కావ్యాలను నాటకాలను రచించిన బహుముఖ మేధావి వంగపండు అప్పలస్వామిగారు.

సరళ సుందరమైన తెలుగులో ఆద్యంతము కావ్యము సాగింది - జీవితానుభావాలను సూక్తుల రూపంలో - బహు చక్కగా పొందుపరచి - కావ్యానికి ఉత్కృష్ట రూపాన్ని అందించారు కవి గారు శ్రీ వంగపండు అప్పలస్వామిగారు.

ఊర్వశి ఒకతె - ఆమెను చుట్టుముట్టిన వారు పదిమంది - పది వ్యక్తిత్వాలు - పది మందివి ఒక మాటకు తెగర్లిన వాక్చాతుర్యం ఊర్వశికి ఉన్నది - అది కవిగారి గొప్పతనం. భారతస్త్రీల ఔన్నత్యాన్ని చాటి చెప్పడానికి కంకణం గట్టుకున్న కవిగారు కృతార్థులు. స్త్రీని గౌరవించవలసిన గుణం అందరికీ అలవడాలని చెప్పిన పద్యాలు అత్యంత రమణీయంగా ఉన్నాయి.

భావమున 'చెలి' రూపమున 'భార్య' అని ఒప్పించ గల్గిన ఈ కవి ధన్యులయ్యారు.

ఆద్యంతం రమణీయంగా సాగే ఈ కావ్యం పలువురి ప్రశంసలందు కొంటుందనటానికి సందేహం లేదు. ఒకచో సంవాదము పెరిగి సాగినట్టనిపించిన వినుగు కనుపించదు.

అందరి మన్ననల అందగల కావ్యం "ఊర్వశీ ప్రణయ కలహం".

**— జయంతి వెంకటరమణ**
ఆంధ్రోపన్యాసకులు
పార్వతీపురం ప్రభుత్వ కళాశాల,
విజయనగరం జిల్లా.

# ఊర్వశీ ప్రణయ కలహం

## (ఊహాచిత్రం)

సిరులు సొగసులు పదములు చిందులేయ
మధురిమలు నాల్గువైపుల మల్లడిగొన
ఎదలు సుధలుంది తనువులు ఏమరపడ
వలపు లలితాంగి ఊర్వశి వచ్చె భువికి.

దివ్యశృంగార రసరేఖ - నవ్యలలిత
మధుర రసధుని మహికామె మన్మధసఖి
జగతి నందాలు చివురించి జన్మమెత్త
వచ్చెనూర్వశి ప్రేమికుల్ ముచ్చటపడ

అడుగులిడునంత దోచెనాట్యములగతులు
పలుకబోవగ మధురిమల్ పులకరించె
రాగమిడగను సరిగమల్ రక్తికట్టె
ఆడబోవగ నభినేత్రి అవతరించె

ఊర్వశీపంకజాక్షి ఆ యోరచూపు
వింతసమ్మోహనాస్త్రమే విశ్వమునకు
చెలియ రతిరేఖ రమ్మనిసైగలిడగ
కురులు పిరుదులపయి ఆడి కూర్మిదోప

దివికి వచ్చిన ఊర్వశి దెసనుగాంచి
యుర్విగల యువకులెల్లరు నివ్వెరపడె
తాపసుల - రాజన్యులకును తారసిలక
ప్రజల ముంగిట నిలచుటాశ్చర్యకరము

ఊర్వశియెవచ్చిభువికని యుబ్బినారు
ఉర్విగల పురుషులెల్లరు గర్వపడుతు
రమణినాశించి కడు యనురాగమంద
ప్రేయసీయంచు వారిట్లు జేరిపలికె

ప్రేమికులు:

యజ్ఞయాగాలు సలిపిన యోగివరులు
వీరమరణమునొందిన శౌర్యవరులు
స్వర్గ భోగాల ఊపిరి ఊర్వశియని
కౌగిలినిచేర్చి సుఖియింత్రు అదియెనిజము

వలపుకత్తెలు మధువులు వన్నెకెక్కు
అమరలోకాల వెలుగువు అబలనీవు
అధరమాశించ నందును అమృతమేకద
కౌగిలినిచేర అందు కైవల్యపథమె.

తనసుపొందగ మర్త్యులు తగుదు మనుచు
మట్టుముట్టిన యువతకు చురకనిడగ
మదనతాపపుమత్తులో వ్యధనచెందు
పలువురినిజూచి ఊరశిపలికెనిట్లు.

ఊర్వశి

సుందరినిపొంద వీరంత ముందుపడిరి
దివిజభామను పొందుటెదివ్యమనిరి
అతివలో ''మీరలాశించు'' ''అంశ''మేది
వినకుతూహలమయ్యెను విప్పిజెపుడు.

దేవకన్యక దెలిపిన భావమరసి
అలుకజెందిరి అటనున్న అవనిజనులు
ఇంద్రలోకపు ఇంతి ఇదేమి వింత
పొందుగోరక ఈరీతి పొడుపుకథల.

పురుషులు:

తమనుప్రశ్నించు ఊర్వశితమకమంద
ధరణిగల పురుషులెల్లరి కరణిదెలిపె
రాగభోగాల కొకరూపు ఆడదికద
అధరమధురామృతంబిచ్చి ఆదుకొనుము

ప్రకృతి పురుషులు ఇరువురు పరవశించి
ఒకరినొకరిని యాశించు టుర్విగుణము
''కామకేళి''ని దేలుట కాంతకు
తప్పుకాదది ప్రకృతిని ఒప్పుగుణమె.

తనువు సుఖమిచ్చుతన్వికి తత్త్వమేల
ననగనూర్వశి ఫక్కున నవ్వెనంత
అదరినారంత ఆశ్చర్యమందినారు
వెకిలినవ్వుకు అర్థము వెదకినారు.

హృదయదౌర్బల్యమెంతయు వదలివనగ
సంకుచిత స్వార్థపరనీతి బింకమిడువ
యుక్తివైచిత్రి సౌజన్యసూక్తి మెరగ
వ్యక్తులకునిట్లు ఊర్వశివ్యక్తపరచె

### ఊర్వశి

భూమిలోపుట్టి పొర్లాడుబుద్ధులన్ని
మాకుతెలియద మనుజుల నైజగుణము
ఆడుకొందురు యవయవాల్నదిమిపట్టి
స్పర్శరతిసౌఖ్యమే మీకు స్వర్గమనగ.

రూపు సొగసులు యవయవాల్ తీపియనుచు
ఆత్మసౌందర్యమును మీరు అరయగలర
స్త్రీనికాంక్షించి మీరందు తీపదెంత
మీసములమీద తేనియల్ మిటకరింపె

దేహసుఖభ్రాంతిలో మీరు దేవులాడి
నాట్య రసధుని నటరాజనాత్మ దెలియు
దివిజవేశ్యని మీరెల్ల తెలియరేమి
''ఆత్మ రసికత''కె మేము అంకితమయ

అచ్ఛమగుమేని సుఖములు తుచ్ఛమనుచు
మగువనాశింప కుందుటే మంచిదనెడి
మెట్టవేదాంతరీతిని కట్టిపెట్ట
ఊర్వశినిజూచి పలికిరి ఉర్విజనులు

## ఉర్విజనులు

ఏమి ఊర్వశి? నీమాటలేమి బాగు?
ప్రకృతిపురుషుల విడదీయు మాటలేల
బీజమేర్పడి భువికిల తేజమిడును
ప్రేయసిప్రియుల అనురాగ పేర్మికాదె.

కాంతవైయుండి పురుషుని కాదనటమ
అతివసొంపుల నందక ఆశపడక
తుచ్ఛమీ మేనిసుఖమని తూలనాడు
పురుషుడీధర ఏనాడు పుట్టబోడు.

ఓరచూపుల భామయె చేరిపిలవ
కొసరి కనుగీటి కోరిక కుమ్మరించ
వెంటబడకను మగవారు వేగగలర
కంటికిని నిద్రవచ్చునె కలదుసుఖము

పడతి పురుషుల రతికేళి పాపమనగ
మగువ రూపానికే మేము మనసుపడము
ఆలుబిడ్డల దరికె మేమసలు పోము
మోహసంసార సంద్రాన మునగబోము

అతివ ప్రేమానురాగాలకాది సుమ్ము
హృదయతంత్రుల మీటిన ఇంతిసుమ్ము
మధురభావాల పురికొల్పు మగువసుమ్ము
మనసునూరటపరచెడి మధువుసుమ్ము

అందమగువస్తు విలలోన ఆడదనుచు
పొందుగోరుట ప్రకృతిలో పొసగుననుచు
కామవాంఛకు భూమిక ''భామ'' యనుచు
పలుకుజనులకు ఊర్వశి పలికెనిట్లు

ఊర్వశి:

దైవమును స్త్రీని మనకవుల్ దివ్యమనుచు
నేలవర్ణించిరో మీరు ఎరుకపడిర
ఇహపరాలతో నీరెండు నిముడుననగ
ముక్తిసాధన కీరెండు మూలమనగ

ఒడలినందెన్ని సోయగాలొప్పియున్న
నెలతకిల గౌరవాలుంట నిండుసున్న
ఇంతినిర్మల ప్రేమనందివ్వకున్న
అందచందాల వెన్నున్న ఎందుకన్న

మోజుపడి మేని సొగసుకి మురసిపోకు
వెడలిపోవును వయసేమొ సడలినపుడు
అతివలో మీరు ఆశించు ''అంశ'' మిదియ?
కాలరీతికి కరిగెడి కమ్మదనమ!

వనితసొంపును వంపును గనుచుమీరు
నుత్పుకతజూపి నునుపుల నందదలచ
ఎగసి యందాలకంతగా వగచి తుదకు
''తన్వి'' అవిబాయ ఏమౌను తరుణి బ్రతుకు?

బాహ్యసౌందర్య మెంతున్న భామఇలను
శీలమునుభాసి నడివీధి సిగ్గువిడచి
పలువురిని పొంద నాశించి పరుగులిడిన
పొందుగోరుదురా? మీరు ముందుచెపుడు.

ఇంతిలో అందచంద మదెంతయున్న
ఇలను పురుషుని బంధించు బలమునున్న
మా వరూధిని ప్రవరాఖ్యు దేవగించె
దివిజభామల మలకన తేటపడదె.

మేని సొగసులె ఇలలోన మేలిమనుచు
''ఆత్మసౌందర్య'' భావన మరచినార
ప్రేమ సద్భావవల్లరి భామగాని
ఆడుకొని యువని విడచిన జాడకాదు

ఇంతి ''మానసోల్లాస స్రవంతి'' గాని
బాహ్యక్రీడకు వీలిచ్చు బంతికాదు
వనిత ''రసమయ మధుర రూపమ్మ'' గాని
ఇమ్మహిని తుచ్ఛసుఖమిచ్చు బొమ్మగాదు.

మదనుబారిని తప్పించి మత్తుగొల్పు
వట్టి శారీరక సుఖాల గుట్టుదెల్పు
తుచ్ఛసుఖములకాడది తూకమగున!
కామకేళిని తీర్చెడి కమ్మదనము!

నీవెప్రాణము లేకున్న నిలువలేను
నిముషమెడబాటు గుండెలోనిడును పోటు
అనుచు తపియించు ప్రేమికుండబల యెడల
''మనసు విరిగెను'' మరి రాక మానునుకద

వేడుకకు రూపమాడది వెలదియనుచు
కౌంగుతగిలిన చాలని పొంగిపోతు
తనకు మనసివ్వలేదని తన్వి అనిన
ప్రేమ భావనె గాలిలో నెటకొనేగు

అచ్ఛమగు పుట్టుకలుసాగి అవనిలోన
స్వచ్ఛమగు దీప్తి విలసిల్ల జాతిలోన
మనను తనువును కలుపుతు మరులు కొలిపె
''ఆత్మచైతన్య రతికేళి'' అవనిరక్ష.

తనువుసుఖమొక్కటెంతయు తగదు అనుచు
ఆత్మసౌందర్య భావనె అందమనుచు
మిగుల వాదించు ఊర్వశి వినగబలికె
పురుషపుంగవులీరీతి పుడమినడచి

**యువకులు:**

గాధి సుతినిల వెన్నంటి గాలమేసి
మేని సుఖమివ్వ మేనక మెలగలేదె
దేవవేశ్య వరూధిని దీటుజూపి
ప్రవరుని వరించ పాట్లెన్నో పడగలేదె.

కామదహనుడె కాంతకై కాలుకదిపి
పడతి మోహినికైనాడు పర్వులెత్తి
రాగద్వేషాల నందని వారలెవరు
ఆశమోహాల నెరుగని వారు లేరు.

సవ్యసాచిని వలపన్ని ఒడినివేయ
వెంటబడినది ఆనాడు మీ ఉలూచి
మీ తిలోత్తమ సంగతి మీకె ఎరుక
పొందగోరనిదెవరితో ముందు చెపుమ

అమరలోకపు తంతు మాకంత తెలును
చీరలెగవేసి భామినుల్ సిగ్గులేక
పదుగురెదుటను పరువము పంచిపెట్టు
కామినులు మీరు ఎవరైన నేమి మగువ.

ఒక ప్రియుడుకాదు - పిలిచినవాడె ప్రియుడు
పలువురిని పొందనాశించు పడతివీవు
చీరసింగారముజూపి సిగ్గులేక
పదుగురెదుట పల్లికలించె పడుచువు

మనసు లేనట్టి మనువునకాసజూపి
ఒకరికె మనసు నర్పించి ముక్తి గనక
నిత్య సింగారభంగిమ నీదులాడ
దలచునీకును మనసొక టబ్బురంబె.

కామవాంఛతో పురుషులు భామనుగని
వాదులాడగ నూర్వశి భేదమంది
ఏది మీరీతి మీనీతి ఏది యనుచు
పలువురిని జూచి ఊర్వశి పలికెనిట్లు

ఊర్వశి

అవని జనులార మీరెల్ల నార్యులుకద
అబలనీరీతి జూడ నన్యాయముకద
దివిజవేశ్యన మీకంత తేలికయిన
కామకేళికి నూతగు కన్యకాదు

దివ్యలోకాలకే నాంది దివిజవేశ్య
ఋషులు దిక్పాలకుదరి దివిజవేశ్య
ఇంద్రసభలోన నర్తించు దివిజవేశ్య
దైవ నృత్యంజలి ఘటించు దివ్యవేశ్య.

నలుగురిలో నాడిపాడిన నాట్యకత్తె
నవరసాలను ఒలికించు నభినయేత్రి
మనసునందున నటరాజే మనులుచుండ
భామలో పాపభావమె పలుకబోదు.

దివ్యలోకాల విహరించు దీప్తినొసగి
రమ్యరసభావ నిర్ఝరుల్ రంగరించ
మనసు బుద్ధియు నాత్మయు మంచినిడగ
హృదయ తంత్రుల మ్రోగించ నూతమేము.

అట్టివేశ్యను దిగదుడిచి మట్టిలోన
బుట్టి మీబుద్ధి మేరకు బుర్రలోన
కామవాంఛను తీర్చెడి కామకనగ
కామప్రేరిత నరులెల్ల కాంచగలరు.

వేశ్య వెలయాలి కర్తలు వెగటుపరచి
సృష్టిజేసిరి మాపయి చురకలేయ
ప్రకృతిలో వేశ్య ఎందుకు ప్రభవమందె
కులసతిని కూల ద్రోచెడి కుట్రకొరక!

గానసాహిత్య నృత్యపు గాలమేసి
మేనగల నరాల్మిక్కిలి మేలుకొనగ
రసధ్వనుల్ హృదయాలలో రాజుకొనగ
దివ్యలోకాలలో మీరు తేలియాడ

అభినయింతును మీరెల్ల అమరులేన
రసము లొలికింతు అందెడి రసికులేన
నటనలోనున్న నాణ్యత నరయగలర
నృత్య రససిద్ధి నందిల నిలువగలర

ఇంద్రలోకాన మేము దేవేంద్రసభలో
నాట్యమొనరించు అందాల భామినులము
సభనధిష్టించు అతిథుల నరసినార
మౌనివర్యులు అష్టదిక్పాలకులు కారె.

నృత్యసంగీత సాహిత్య దైవగతులు
వ్యక్తపడ భంగిమాల జాపు భామలమయ
సర్వసంకల్ప సన్యాసి సరసమాడు
తుచ్ఛమగుదృష్టితో మమ్ము జూడగలర!

జననమరణము లేనట్టి జన్మలుగల
దివినిగల మేము ఏనాడు దివ్యులమెగ
భువినిగల మీరు మాతోడ పోలికేమి
భావనలో భాగ్యమున మా త్రోవవేరు.

గుణగణాలలో ఒకటన్న గురుతులేదు
రూపురేఖల మీరెల్ల ఒకటిగాదు
భావనలో ఏకమేనన్న త్రోవలేదు
అభిరుచిలోమీరు ఐక్యమౌ జాడలేదు

జనులనే తినమరగిన జన్మ ఒకటి
పరుల కష్టాలదీర్చెడి ప్రాణి ఒకటి
స్వార్థపర శక్తులొకవైపు సంచరించు
జగతి నిస్వార్థ జనులును జాగృతిగను.

పుట్టుకతో ప్రకృతి ఇచ్చిన గుణగణాలు
ప్రజ్ఞప్రతిభలు ఒకరీతి పలకవన్న
పుడమి అవివేక బలహీనులుండుకతన
ఒరుల దినుబుట్టు జాతులు నుర్వివెలయు.

క్రిములు కీటకసంతతి జలచరములు
చెట్టుచేమలు వృక్షాలు జంతుజగతి
ఏవినొకరీతినున్నవి ఎందులోన
పుడమిననమాన తెల్లడనడచుననగ

సంఘ సమతను సాధించ సాగగలరు
''ఆర్థిక'' సమానతను తేవనడవగలరు
పలువురిల స్వేచ్ఛబాటను మెలగగలరు
మానవ ప్రవృత్తినే మీరు మార్చగలర!

రాగద్వేషాలనందిన రాజు ఒకరు
జగతినంటక దిరుగు రాజర్షి యొకడు
మానవుని మనస్తత్వము మలచబడదు
నరుని బలహీనతేమిటో నరయబడదు

జీవకోటిలో మానవజీవితంబు
తర్క విజ్ఞాన జిజ్ఞాన తరగని గని
ప్రకృతి జన్యమె ''గుణమ''ని పలికె. ''గీత''
''కర్మ'' స్వాభావికపు ధర్మ మనుచు జెప్పె.

కులము ఆచారధర్మాలు బలముగాను
నాటుకొని పాయినవి నరజాతిలోన
ఏ ఒకరో వీటినిల్పిన ఇన్ని యేండ్లు
చెదరబెదరక యుండునా చోద్యమేకద?

అవని కలిమియు బలిమియు పరిమితములు
అపరిమితమగు జనులకు అందగలవ
జ్ఞాన సౌశీల్యదారుల జనులు నడువ
పట్టుబడునివి జనతకు ఫలితమివ్వ.

అవని ప్రజలను యిట్లవమాన పరచి
దెప్పిపొడిచెడి ఊర్వశి దెసనుగాంచి
కర్క తర్కశ రీతులు కదలియాడ
ప్రజలు పలికిరి యీరీతి ప్రజ్ఞదోప

అవని అసమానతల బాప వలనుకాదు
అనుచు దెలిపిన ఊర్వశి అబ్బురపడ
అవని జనులెల్ల నీరీతి యడిగినారు
''మూడులోకాల'' తీరది పాడుయనగ

ప్రజలు

హెచ్చుతగ్గుల ప్రస్తాననేమి వద్దు
నాసటరాతల తోనిట మెసలవద్దు
కర్మసిద్ధాంత మర్మాన్ని కదపవద్దు
మమత సమతల మార్గమే మాకురక్ష

దివిని విడిచియు నీరీతి భువినిజేరి
దైవమానవ రీతిని తరచినావ
దివ్యలోకాల భావనా జగతియెల్ల
వ్యక్తి ''దివ్యాత్మశక్తికి'' వ్యక్తము కద.

అంగనామణి ఊర్వశీ నంగనాచి
వనగ దెలిపితి వెన్నో అసంగతాలు
హెచ్చుతగ్గుల భావాలు రెచ్చగొట్టి
మచ్చుబడబోకు మేమెల్ల మెచ్చబోము.

పాడువడిన వ్యవస్థకే ప్రాణమీవు
బూజువట్టిన సంస్కృతి బీజమీవు
రాచరికరీతికే నీవు రాణివి కద
పెట్టుబడిదార్ల సొత్తువు ప్రేయసివిల

అధములని ఆర్యులని జనతకర్థమిచ్చి
పుట్టుకతో బేధభావాలు పుట్టుననుచు
ఉచ్చనీచకులాల రచ్చమీద
ఎగిరిగంతేయ నుచ్చులో నిమడగలవు.

శుంఠలని భ్రష్టులనియు నికృష్టులంటు
ఊడిగపు జాతికూపిరి పోసిపోసి
కల్లకపటాలతో వారికడుపు కొట్టు
దోపిడీదార్ల కూర్వశీ తొత్తునీవు.

ఇహపరాలవి రెండని విప్పిజెప్పి
కలిమిలేమికి గత జన్మ ''కర్మ'' అనుచు
ఇల దరిద్రులు స్వర్గాన ఇంద్రులవగ
పాదపూజ సమర్పణాజ్ఞరుపవలెన!

దైవభీతిని కల్పించి దేవులమని
ఈశ్వరుని మాయ ''సంసార'' మీదుడనుచు
పిట్టకథలల్లి పొట్టల నింపుకొనుచు
దైవద్రోహము చేయగ దలచినార

''విశ్వచేతస్సు'' విశ్వాత్మ నీశ్వరునిల
స్వీయ బ్రతుకులసాగెడి సాధనమని
ఇలను నిలిచారు పోవ ''శాండిల్యవిద్య''
ఆత్మపరమాత్మ భావాల కద్భుతగిలి

అందువలనె ఊర్వశీ ఎందుకూడ
మండుచున్నది ప్రజల పరాభవాగ్ని
వసుధపాలించ పాలనాన్యాయముగొన
నరిసమానత సాధింపె సార్థకతన.

రెచ్చిపోయిన ప్రజలెల్ల రచ్చకెక్కి
బీరములబల్కి ప్రజలను ఊరడించ
శాంతిసత్యాలె జగతికి రక్షయనగ
కరములనుమోడ్చి ఊర్వశీ కరణివల్కె

**ఊర్వశి:**
ధనిక, నిర్ధనికులన్నాప దలచినార!
ఇరువురునుజూడ మీలోన ఇముడువారె
హెచ్చుతగ్గులు వీరిలో వీడివనగ
సంపదల నాక్రమించక సంఘటేల.

నేటి ధనికుడు రేపటి నిర్ధనికుడు
ధన విహీనుడె ఒకనాడు ధనికుడగును
మనిషి మనిషికి శత్రువ మాయమాట
సర్వులదె సంపదన సంఘర్షనేల!

ఒకరికుత్తుక వేరొకరుత్తరించు
విషమసంస్కృతి మనకేల వీడవలయు
జన్మధాతలే జనస్వామ్య ప్రగతి పరులు
నాగరిక సమాజానికి నాంది పరులు

అనుభవేతర సంస్కార జన్యమైన
జ్ఞానమిచ్చెడి స్మృతులను జాడగనక
భౌతికాసక్తి భుక్తికే లొంగినీవు
ధరను ఆధ్యాత్మికపుశక్తి మరచినావు

మతమనగ నీవు వెతలని అరవవద్దు
అతుకుకతుకుల కతలని ఠరయవద్దు
దేవలోకపు శక్తిని తెలియ మీరు
తేరుకొనుడింక మీరెల్ల తేజమంద.

**పురుషులు:**
దేవలోకమె గొప్పని చెప్పబోకు
ఏమిసాధించినారని ఏమిగొప్ప
మాయతో సృష్టిజేసిన మహిమదేమి
శ్రమతొ సృష్టించ నదియె సంతృప్తినిచ్చు.

బాపురేయన కట్టిన గోపురాలు
దివ్య హర్మ్యాలు భవనాలు దీప్తినివ్వ
సృష్టినే తీర్చి దిద్దెడి సోయగాలు
ఏడనున్నవి మీలోకమేమి గొప్ప.

అమరప్రేమకు చిహ్నమౌ కట్టడాలు
హాయినిచ్చెడి ప్రకృతిలో సోయగాలు
జీవితామృత మొసగు నదీనదాలు
ఏడనున్నవి మీలోక మేమిగొప్ప.

దేవుడేరీతి విడివడు జీవినుండి
వెలుగునీడలు ఎడబాపి మెలగగలవ
దివిజులము మేము మాకెవరు దీటు అనకు
''దివ్యతేజస్సే'' జగతికి దీపముకద

**ఊర్వశి:**

స్వర్గలోకము భువికన్న స్వల్పమనుచు
జన్మభూమియె గొప్పను జనులజూచి
పలికెనూర్వశి నీరీతి పదుగురు విన
మీరు నాస్తికవాదులు మరులుడింక.

**పురుషులు:**

దెప్పిపొడచిన ఊర్వశి దెసనుగాంచి
ఊర్విజనులెల్ల నీరీతి గర్వపడిరి
స్వర్గలోకాన లభియించు సౌఖ్యములను
సృష్టిజేసితి మీధర ద్రష్టలమన.

తర్కమును హేతువాదము తత్త్వరీతి
ననుసరించిన మేమెల్ల ఆస్తికులమె
అణువణువనందు ''దైవము'' అద్భుతము
విశ్వమున దైవమొకడన్ని విధముమాది.

విశ్వమున దైవరూపాలు వేయిఅసిన
కాదుకాదని మాకేల వాదులాట
''విశ్వచేతస్సు'' జీవుల వెలుగు కొరకె
ఆత్మపరమాత్మ రూపాలు అవని కొరకె

జీవకోటిలో మానవ జీవి ఎంత?
తర్క- విజ్ఞాన మేధస్సు తపన ఎంత?
క్షణిక జీవన సుఖశాంతి తత్వమెంత?
విశ్వకర్తను శంకించ నెంత వింత!

జ్ఞానపీఠానికే మేము తగుదుమనుచు
ఇతరులందరు నందుకనర్హులనుచు
దైవమును స్వప్రయోజన పరిధికీడ్చు
జనుల దూషించగలము దైవమునుకాదు.

ఊర్వశి:

అనగవిని ఊర్వశియునాశ్చర్యపడుచు
జీవికొక ఆత్మకలదని తెలియజెప్పి
ఆత్మదైవాంశ సంభూత మనుచు దెల్పి
ఉత్తములు మీరు ''ఉవిదకై'' ఊగులాట!

జ్ఞానవిజ్ఞాన సౌశీల్య జగతిపరులు
అందచందాలకై మీరు ఆశపడుతు
మెరుగులను జూచి మోహాన కరిగిపోయి
మగువకై మీరు ఇంతగా మరులు కొనుట?

ఇహమునందున సుఖశాంతులిముడుననుచు
పరసుఖాలకు మీరేల ప్రాకవలయు
మానవుడు దైవసముడని మాట పిలికి
దివిజ వనితకు మీరంత దేవులాట?

పురుషవరులార మీరు పునీతులనగ
ఆత్మపరమాత్మ భేదాల నరసినార
తుచ్ఛసుఖమునకాశిస్తు తూలిపోతు
మరల నీచపుబుద్ధులు మంచిదగున

## ఊర్విజనులు

ఊర్వశీరీతి బోధించ నుర్విజనులు
''ఏమి ఊర్వశి నీసౌఖ్యమెంత గొప్ప''
ప్రకృతి సత్యాలనేమైన పలికినాద
''ఇనుప తెర''వేసి విషయాల దెలిపినావె

కామసూత్రాన భువిలోన కన్నుతెరచి
కామవాంఛను కాదని కదలగలమ
మనసు నుల్లాసపరచిన మధువునిచ్చి
మనుజాలను ఓలలాడించు మగువకాదె

జాతి అందిన అపురూప జ్ఞాన ధనము
భోగభాగ్యాలకే మేము భోక్తలమని
ఇతరులకు పంచదలచక నిష్టపడక
వేరువేరు అను అర్థాల వెదకినావ

మీరు పాటించనొల్లని రీతినీతి
మేము పాటించి నిలవాలి మేలుమేలు
సురలనొక ప్రక్క దైవ స్వరూపులనుచు
మర్త్యులిల నైజబుద్ధితో మసలుననుచు

ఆకలేరాదు దరికి మాకనుచుదెలిపి
సోమరసమును కడుపార గ్రోలనేల
ఉన్నతినిగొను లోకానయున్న మీరు
పాడులోకాల బుద్ధులే తోడుమీకు

అసురభావాలకందని అమరులమని
సంపదధికార జంటను వదలలేక
రాక్షసులపోరు పడలేక, రామరామ
ఎన్నియుద్ధాలు భజనలు ఎన్నిపాట్లు?

దేవలోకము మాదని తెలిపినారు
కక్ష కలతలు లేవని పలుకగలవ
మానివర్యులు అష్టదిక్పాలకులును
ఇంద్రుడున్నను మీలోక మింతియెకద

మనసుదోచిన "కచు" నేల మత్సరించి
దేవయాని "యయాతి"లో నేమిజూచె
మనసు ఒకనికి అర్పించి మనవుసాగ
వేరొకని చేయి బట్టుచు వెడలెనుకద

"దేవగురు"నికి సతినన్న రీతి మరచి
తారచంద్రునితోకూడ తపన చెంది
అందచందాల "శశి"తన చెంతనున్న
పరసతి అహల్య కింద్రుడు పరవశించె.

మీవరూధిని ప్రవరుని మీదపడతు
కామకేళికి రమ్మని కన్నుగీటె
గాధిసుతిని తపోభంగ కర్త్రియగుచు
తనువు తపసికి మేనక తర్పణమిడె.

రంభయన రసికతెల్లడ పొంగిపొరలు
వన్నె వయసును చనుగవ కన్నుదోయ
నునుపు తీర్చిన పిరుదులు తనువుసొగసు
ఇంద్రపదవికి రక్షణ ఈమె కాదె.

తనను పెండ్లాడనెంతయో తపనపడిన
పార్వతిని స్వీకరించిన పరమ శివుడు
నెత్తినెక్కిన గంగను ఏలుకొనడె
ఇతరులకు జెప్ప నీతులు ఇంపుకాదె.

అర్ధరాలర్ధభాగాని కతివ యనుచు
మేనిలో చోటు యిచ్చిన ఈశ్వరుండె
మోహినిని జూచి మోహాన వెంబడించె
పడతి నాశించనొల్లని ప్రముఖుడెవడు!

లక్ష్మి తన సతి భూదేవి మలపుకత్తె
తులసి వ్యామోహమునసేల తూలిపోయె
విష్ణుమూర్తినే రతిసౌఖ్యమింత సేయ
మనుజ మాత్రునికేపాటి మహిమకలదు.

మగువలనుజూచి దేవతల్ మరులు కొనగ
మానవులు కామవాంఛను మానగలర
విషయవాంఛలొ దైవజ్ఞలీదులాడ
మేమనగనంత ఊర్వశీ మోముజూపు.

కాంతకనుదోయి వలపు క్రీగంటి చూపు
ప్రణయ చెక్కిళ్లు చనుదోయి నడుముతీరు
పాలభాగము ముంగురుల్ పడచుదనము
సిగ్గుపడని శరీరమే స్త్రీకి లేదు.

నిత్య మరుకేళిలో తేలి నీదులాడు
ఋషులు ఆనాడు మెలగిన తీరదేమి
మత్స్య గంధిపరాశర మౌనివరుడు
నలిపె నరసమ లేక సంసారమమ్మ?

ఊర్వశీ నీవింద్రుని ఉంపుగత్తె
వనగనీకేల ఉక్రోష మదియె నిజము
పార్థుడెవరమ్మ మోహాన పరవశించి
కామసంతృప్తినిమ్మని కదలినావె

రాజులకు యోగులకు ఊర్వశి ''రాణి'' నీవు
ఇంపుగత్తెల ''రాజు'' మీ ఇంద్రుడేగద
రాజురాణీల సంగతి మాకు తెలుసు
సంపదధికారాల చిహ్నాలు స్వార్థపరులు

రాజురాణీలపాలన మోజులోనె
శూద్ర వెదవలు మాలపీనుగులటంచు
శాపనార్థాలనిడె నాటి పాపజాతి
కర్మ సిద్ధాంతమని చెప్పి కళ్లుగప్పి

బాపనయ్యకు వ్యవసాయ మబ్బిరాదు
శూద్రుడిల జపమొనర్చుట శుద్ధతప్పు
మనిషి దైవాన్ని పూజించనడ్డగించు
దేవతల కథల మావద్ద తెలుపవద్దు.

**ఊర్వశి:**

ఓయి కాముక నీజ్ఞాన మోడిపోయె
భౌతికాశక్తికె లొంగు బంటువీవు
ఓయి మానవా నీబుద్ధి బూజుపట్టె
చదువు సంస్కార సభ్యతల్ మరచినావు

అవని జనులార మీరెల్ల ఆర్యులు కద
స్వీయ ధర్మాలనె మీరు చరచరాదు
దైవ ధూషణచేయ మీ ధైర్యమేమి?
త్రిగుణములజాడ నేగక తిరుగవద్దు.

జాతి సంస్కృతి కాపాడు జనులు మీరు
స్వీయ ధర్మాల్ని తెగనాడ నిలచినార
అంతరాలను సృష్టించ పంతమూన
వలద వలదంచు ఊర్వశి పలికెనిట్లు

దుఃఖితుడు మూర్ఖుడజ్ఞాని శూద్రునిగను
''బ్రహ్మసూత్రము'' జెప్పి నిమ్మహిసినాడు
జప తపాదులు ఎవరికి జన్మహక్కు
జ్ఞానవిజ్ఞాన మెరిగిన జనలకేను

జ్ఞానపీఠమె లేకున్న జగతి లేదు
జ్ఞానవిజ్ఞానము పంచి జనులకెల్ల
బోధజేసిల జాతికి మోదమిచ్చు
బ్రహ్మజ్ఞానికి వ్యవసాయ మబ్బునయ్య

''మానవ ప్రవృత్తి'' మేరకె మనుగడునుచు
''జన్మతః'' గుణకర్మలు జగతినడచు
నీ ''స్వభావపు జన్యమే'' ''నీదు కర్మ''
నీ ''ప్రవృత్తి''ని నీ కర్మ ఎరుకపరుచు

ప్రకృతి సిద్ధము త్రిగుణాల పుడమినడచు
కర్మలకునాంది మనుజాల ధర్మములన
సత్త్వరజస్తమో గుణాల్తత్వములవి
వ్యక్తుల ప్రవృత్తులన్ దెలిపి వేరుచేయు.

కాయకష్టములోనుంది కలిమినేడు
కలిమినందిన జనతకే విలువనేడు
మిమ్ములను మీరే శంకించనేమి బాగు
స్వీయ ''ధర్మాల''నున్నవి ''సిరులు'' నేడు

బుద్ధి జాడ్యమే మీలోన హద్దులిడిన
మంచియన్నది మీలోన మండిపడిన
హృదయమున కుసంస్కారము ఉట్టిపడగ
స్వార్థమాసించి ''సంస్కృతిన్'' చంపదగున

జ్ఞాన ఖడ్గము నిరువైపు దారుకలిగి
మంచిచెడుల రెండిటిని త్రుంచగలదు
వెలుగునీడలు ఇలలోన నిలుచు వరకు
దివ్యలోకము నరలోకమెరుకపడును

జీవుడే దేవుడని మీరు తెలియజెప్పి
దేవునిల మరల దూషించ తగునమీకు
స్వీయ ''ఆత్మ''నే తెగనాడ చిందులేయ
మీరు ''పరమాత్మ'' నేరీతి నరయగలరు

కట్టుకథల పురాణాలు కట్టలిప్పి
కర్మభూమిని కాదని కదలబోకు
వేదముల నుపనిషత్తుల వెదకిచూడు
జ్ఞానవిజ్ఞాన మార్గాలు జాగృతినిడు

గత పురాతన సాహితీ చదువరివయి
దైవలోకాల దొసగుల జెప్పినావ!
అనుశ్రుతిగ వారువీరను మాటమీద
వెకిలిగా వారి తప్పును వెదకినావ!

పరమ పావన గ్రంథాలు వరమునిచ్చు
భాగవత రామాయణ భారతాలు
ధ్వని ప్రధానము వాత్యార్థమరయబోకు
వ్యంగ్య వైభవ సంపత్తి రంగరించు

తుచ్ఛమగు మేని సుఖమున తూలిపడుచు
అచ్ఛమగు అమర భావన తుచ్ఛమగు
విఱ్ఱవీగక వింటివా వీనులార
''గీత'' ఇల భగవానుని ''దూత'' అనగ

రసికులము మేము ఎంతగా తగుదుమనుచు
ఉవిద ఊర్వశికై నువ్విళ్లూరినాడు
రసిక రాజన్యులను మీరు అరసినార!
పంచకావ్యాల మిగుల పఠించినార!

అవని సౌఖ్యాలకు కొంకరూపు ఆడదనుచు
అమరలోకాల భావన కాదియనుచు
దివిజ శృంగార రీతికి దీటటంచు
తెలియజెప్పిన మీరెల్ల తెలివిపరులె

భావ ప్రతిభావ ద్వందిత ప్రణయమగును
ప్రేయసీ ప్రియులు లిర్వురు పేర్మిగనగ
పశువు పక్షుల మాదిరి పరవసించి
సరసమాడిన అదియేమి చక్కదనము

భావగర్భితమై యున్న కథలలోన
విషయవాంఛల వింటివా వీనులార
ఆత్మ శారీక ధర్మమవనిగాంచ
మనపురాతన సాహితి ''పురిని'' విప్పె

సౌఖ్యమున కాది సంపద-కాదు మనసు.
అనుచు సీతమ్మ భర్తతో అడవికేగె
వనెతకిల తృప్తినిచ్చునా వస్తురాశి
భర్తసన్నిదే ''పెన్నిది' పడతికనుచు

పడతి కిల పతియె దైవము ప్రాణమనగ
ప్రతిన బట్టిన ఒకనాడు పడతి చూడు
కాల యమునితో కలబడి కయ్యమాడె
''ఆత్మశక్తియే'' సావిత్రికాయుధమనగ

ధరనుగల భోగభాగ్యాల ననుభవించ
ఒకరు తగరని వేరొకరరుహులనుచు
తెలిపినది మీరె ఒకమారు తెలిసికొనుడు
వర్గవర్ణాల సృష్టది వసుధలోనె

కులమొకటె మాది ''దేవతా'' కులము అనగ
మతమగుటె మాది ''మనసున్న'' దైవమతము
స్వర్గమున వర్గవర్ణాల జాడనేగి
ఉచ్చనీచ కులాలంటు మెచ్చబోరు

వేదములు జీవనాదాలు వెలుగనివ్వ
జీవి పరమార్థగతులను విప్పిజెప్పు
''ఆత్మ'' పరమాత్మనందగ తపనపడగ
అవతరించిన మన తపోధనుల పంట

మన ప్రబంధాల కావ్యాల పద రవళిలో
వర్ణనారీతి పదశోభ వన్నెలగొన
ప్రేమ ధార్మిక లీజగతి పేర్మిని గనె
పూర్వరీతులు అందాలు పుంజుకొనగ

ఉర్వి ప్రజలు

ఏమి ఊర్వశి నీతత్త్వమేమి బాగు
తత్త్వగ్రంథాల నెల్లను తరచినావ
కర్మసిద్ధాంత మర్మాన్ని కదపవద్దు
లేనిపోని విషాదాలు లేపవద్దు

కోరికల గూడులో దూరి ఒడిపోయి
తృష్ణ్యామోహ రీతిలో తేలియాడు
దేవతలు మాకు జెప్పెడి తెరువదేమి
మీరువల్లని పాఠాలు మాకదేల

## ఊర్వశి

అనగ వినుచును ఊర్వశి అంత పలికె
పురుషుడొక వనిత నాశించ ముప్పులేదు
పలువురొక పడతినే పట్ట తప్పుకాదె
ప్రేయసికి పెక్కు ప్రియులిల పెనుపుకాదె

ఊర్వశి అందగత్తెని ఉర్విజనులు
నన్ను వెంటాడ ఇదిఏమి నాగరిగత
పలువురొక పడతి నాశించు పాడుబుద్ధి
వీడకున్నను ఏనాడు కీడె కలుగు

''భార్య'' ''ప్రేయసి'' వేరను భ్రాంతినొంది
ఇరువురొకటన్న తీరును విస్మరించె
మహిలో ఆత్మ శరీరాల్ మనుజుడన్న
రీతి నీతులవిడనాడి వేగగలర

మగడు మక్కువ పడగను మనసునిచ్చి
ప్రేమ స్పందించ నామియె ''ప్రేయసి''యగు
జీవితము సాగ దినచర్య జీవికగొన
భర్తకిల బాసటగనున్న ''భార్య'' యగును

ప్రకృతి పురుషులభేద్యులు ఆత్మలోన
భిన్నరూపాలు భౌతికరీతిలోనె
ఇరువురును ఒక్కరను మాట ఇలను నిజం
ఒకరిలో నిద్దరిని చూడ నొప్పెయగున్

భౌతిక సుఖాపేక్షనందించ భార్యయగుచు
తనువు సుఖముల నిచ్చిన తమ్మియగున్
ప్రేమమయి జీవితంబొసగ ప్రేయసి అయి
ఆత్మ చైతన్య రతికేళి ఆడది యగు

వలపు జంటకు ఐక్యత ప్రాతిపదిక
ప్రేమకుండిన ఈనెడి విరులునుమ్ము
ఇంతియిల ''భార్య'' ''ప్రేయసై'' మెలగకున్న
కాంతుడిల పొందనాశించు క్రాంతినున్న.

కామునికి సతిదోచు ''కామినిగనె''
ప్రణయమయికామె ''రసధుని'' రమ్యరాజ్ఞి
ఒకరికామెయె భోగంపు ఒప్పులాడి
వేరొకరికామె నిజమైన వెలుగుజాడ.

ముదిత శక్తికి యుక్తికి మురిపమంది
తనువునందర్థ భాగము తన్వికినిడె
''సకలశక్తి ప్రదాయిని'' చానయనగ
మదినితానెంచి ''శివుడు''ను మనగలేదె

నిఖిలభోగాల నొసగెడి సఖిని మిగుల
హృదయమందున ముదమార నిలిపెనొకడు
''వన్నెలొలికెడి జాబిల్లి'' వనితయనగ
మదిలోతానెంచి ''విష్ణువు'' మెదలలేదె.

ప్రణుతికెక్కిన సౌశీల్యవతిని సతిని
తనదుజిహ్వాగ్రమున నుండ తానుకోరె
''వెలుగు విజ్ఞానరూపమె'' వెలదియనగ
హృదిని తానెంచి ''బ్రహ్మ''యు మురియలేదె.

ఊర్వశీరీతి బలుకగా నుర్విజనులు
శిరములనువంచి రెల్లరు సిగ్గుపడుతు
పడతిపైవారి భావన తప్పు అనగ
''ఇచ్ఛ జ్ఞాన క్రియాశక్తి'' బీజమనగ

చుట్టుముట్టిన పురుషులు పట్టువదలి
వెడలి జనుచుండ నూర్వశి కేకవేసి
ముందువెనుకల గానని యువకులార
మరలనొకమాట చెవినేతు నురలిరండు

యువకులనిరిట్లు ఊర్వశి చెంతజేరి
ఏలమమ్మిట్లు అపహాస్యమేల జేయ!
''భార్య'' ''ప్రేయసి'' వేరను భ్రాంతిలేదు.
ఉవిదలో రెండు లక్షణాలుండు నిజమె.

అనగ నూర్వశి ఫక్కున నవ్వి అనెను
గతమునందలి ఘనతను గౌరవించి
చెరుపునిడ ''సంస్కృతై'' నను చేదుయనుచు
ప్రణయకలహము సాగింది కలతవద్దు.

అందమగు వస్తువిలలోన ఆడదనుచు
పొందగోరుట ప్రకృతిలో పొసగుననుచు
ముందువెనుకలగానక ముప్పుతెచ్చె
భ్రమలతో జీవితాలను గడపవద్దు.

ఆడమగ రూపభేదాలు అవనివెలసె
మంచిసంస్కార సభ్యతలు మారుపలక
తనను వల్లని వనితకై తన్మయపడి
తనువుసుఖమొంద తపియించ తప్పుకాదె.

కథలు కావ్యాలు చిత్రాలు కల్పనాలు
పురుషునొకనికి ప్రేయసి రిరువురనుచు
పడతిపిల బానిసగచేసి పాటపాడు
పాడుపద్ధతి నికపై వీడవలయుదు.

ఇంద్రలోకాన నెలకొను పెద్దలకును
దైవలోకాన నడుగిడు దివ్యులకును
సరససంగీత సాహితీ సాక్షులమయ
మలకనగ మీరు మమ్మేల మాచినారు.

అభినయము నాట్య విన్యాసగతులు జతలు
మనసు బుద్ధిని ఆత్మను మలినపరచ
కళలు కావ్యాలు తలమున - తప్పుకాదె
తుచ్ఛరతికేళి కివియన్ని తూకమునకు.

నాదబ్రహ్మను సేవించి నర్తనమున
నాట్యవిన్యాస శ్రుతి లయల్ తాండవించ
సరససంగీత సాహితీ జరులు కురియ
పలువురిని ఓలలాడించు ప్రజ్ఞమాది.

మనసు బుద్ధియు నాత్మయు మత్తునపడ
రాగలయతాల సంపత్తి రంగరించి
దివ్యలోకాలలో మీరు తేలియాడ
ముక్తి మోక్షాల బీజమై మొలుతుమేము.

ప్రకృతి పురుషుల ఎడబాటు ప్రళయమనెడి
హరవిలాసమె జగతికి ఆదర్శముకద
''ప్రకృతి'' ''పురుషుని'' విడనాడి పయనమువగ
సలిపి నటరాజా అదియె శివతాండవమన.

వెలుగు విరజిమ్ము అందాల ''దివ్వె'' నేనె
కవులకును కల్పవల్లిని ''కాంతి'' నేనె
దివ్యలోకాల రసమయ ''దీప్తి'' నేనె
రసిక తుష్టింగు జనతకు ''రాజ్ఞి'' నేనె.

సంపదధికార కర్తలు ప్రజలెనేడు
ఇంద్రరాజేంద్రపదవులు ఇంక లేవు
రాగభోగాలు ప్రజలవె రాజులుకద
సామ్యవాద సమాజమే సాక్షి మనకు.

నాట్యమొక ''దైవ ప్రీతని అరయరండి
లలితకళ దైవరూపము మరువకండి
మనుజులును ఆత్మదైవాల నరసినారు
మమతలను పెంచి కళలన్ని మంచినిడును.

ఘనఘృతాచి తిలోత్తమ మంజుఘోష
మేనకయు రంభ ఊర్వశి చిత్రరేఖ
రమ్య రస సుకేశిని సురాంగనలన
అమరసింహుడు దెలిపిన అప్సరసలు.

దివిజకన్యల ''పేర్లలో'' దెలియపడవె
దివ్య శృంగార రసరేఖ చిత్రములన
దివ్యలోకాల అనుభూతి తేజమిడగ
ధరను ''తారలవలె'' వీరు దర్శనమిడు.

ధరనుగల ప్రజాసంఖ్య కోటానుకోట్లు
మేమనగనెంత సంఖ్యలోనేమిగాము
తెరలపై చూడుడిక మీరు తెలివినండి
ప్రజలు కళకాంతులను పొంది పరవశించ.

దూరశ్రవణాలు చిత్రప్రదర్శనాలు
దూరదర్శన వీడియో దూర్భిణీలు
కొదవ లేదయ్య లోకాన కోటివేలు
ప్రతిఒకరికందు గజ్జల రవళిమ్రోత.

సాగిపోతున్న మబ్బులన్ సాగనిమ్ము
ఎగిరిపోతున్న పక్షులన్ ఎగరనిమ్ము
ఊగిపోతున్న రెమ్మలన్ ఊగనిమ్ము
జారి ప్రవహించు నదులను జారనిమ్ము

మురిపములరాణి ''మీ భార్య'' ముచ్చటపడి
''చెలిగ'' మీ ప్రక్క మెలుగుతు వలపునిడగ
ప్రతిదినమువచ్చి మమ్ములనరయవచ్చు
భామవినగ సరాగాలు పలకవచ్చు.

పగలు పనిపాట్లలో మీరు పట్టువడగ
సంధ్య సమయాన విశ్రాంతి తప్పదుమరి
''మనసు బుద్ధియు నాత్మయు'' మంచినిడగ
మమ్ములను ''తెరను'' జూడగ మానరుమరి.

''భౌతికాధ్యాత్మికపురీతి'' పుంజుకొనగ
''దివి''నిగల శక్తి ''భువి''కెల్ల దీప్తినిడగ
''భావమున'' చెలి ''రూపమున'' భార్యయనగ
నూర్వశీ ప్రణయకలహము ఉర్వి వెలసె.

— సమాప్తం —